శ్రీసీతారామసహాయం.

# స్త్రీపురుషనీతిసంగ్రహము.

అనునీగ్రంథము-

సర్వజనులకు నత్యంతోపయోగకరముగునటుల

తునిపట్టణంబున వెలసియున్న

లేటు శ్రీపెద్దాపురంసమస్థానాధిపతులున్ను-ప్రస్తుతం (శ్రీ రాజావారు

వారున్ను అయిన

శ్రీ రాజా వత్సవాయ వేంకటసింహాద్రిజగపతిరా

జుబహద్దరుగారిచేరచియింపంబడి

స్వకీయ

శ్రీసీతారామనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపించిప్రచురింపంబడియె.

తే ౧౨ ది డిశంబరు ౧౯౧౦ సం॥రం

ప్రింటరు, శ్రీరంగం సీతారామయ్య







శ్రీసీతారామాయనమః॥

శ్రీపార్వత్యైనమశ్శివాయనమః॥

శ్రీవిఘ్నేశ్వరాయనమః॥

## స్త్రీపురుషనీతిసంగ్రహము॥

సౌభాగ్యతగల పతివ్రతయయియుండియు, నొప్పుకొననిదియైన పరుని నొకనిభార్యనునిర్బంధనచేసి, పొందగోరినయాపాపాత్మను జాధము నిమహారౌరవాదినరకములయందు మరుగుచున్నచమురులోపడవేయుటయు, కొండలమీదనుండిక్రిందికినధోముఖముగబడద్రోయుటయు, నినుపగదలచేతనుదంచుచు, నగ్నిమయములైన కాలినయినుపబొమ్మలను కౌగిలింపజేయుచు, కాలినయినపగుండ్లచేత గొట్టుచు, కాలినయినుపశూలంబులచే గ్రుచ్చుచు, నాయుధశస్త్రాస్త్రములచే ఖండించుచు, నీమొదలయినయనేకతర్జనాదిబాధలను లెక్కలేనియనేకవత్సరములు పొందించుటయేగాక యనేకజన్మములువానిసిరిసంపత్తులనునశింపజేయును॥

ఒకనిభార్యను సంసారఘాతచేసి, విడదీసినపాపాత్ముడుమహారౌరవాదినరకములనుపొందును తనభార్యను పరపురుషుడు పొందినదనకెట్లిబ్బంది గలుగునో మరియొకనిభార్యను తానుపొందిన వానికినట్లేయుండునని ప్రతిమనుజుడు నాలోచించుకొనతగినదయ్యేయున్నది, అట్లొకనిభార్యను విడదీ తానుపొందినప్పుడట్లు విడదీసిన దానిభర్తతనభార్యతో పొందినను, తాను పరస్త్రీగమనము చేయుచుంటే మరియొకపురుషునితో తనభార్యయు కా మాదేశికమును పట్టజాలక జారత్వమవలంబించినను, తానుసిగ్గుతో బుర్ర ద ంచుకొనియేమియుజేయలేకయేడ్చుచునూరకొనవలసివచ్చునుగానియే మియుచేయలేదు తనపిల్లలున్ను జారత్వముతో సంచరించుచున్నను తా నేమియుననలేకయూరుకొనవలసియేవచ్చును-

పరకాంతతోడదానిభర్తనువంచనజేసిపొందినగాని పరస్త్రీనివం చిదానిభర్తతోపొందినగాని యాదుష్టునిపట్టుకొని యతివేగముననంధక మిస్రనరకమునబడవేసి, యినపగదలు మొదలయినవాటితోను దండించ

ఖంబున కేటిదుఃఖముల్ | వలగొనువారకామినులపజ్జలక్కగ పదివేలదండ ముల్ ॥

టీ॥ ఉలిమిరిచెట్టుపళ్లున్ను, రసపుకిక్కలిస్సీ చప్పిడిరొట్టిముక్కలున్ను, నులకమంచపుకుక్కలున్ను చీకటిచ్చున్ను సుఖరోగములుతగిలి యీబాధ లుపడడమున్ను వకనాటిసుఖముకోసరమెల్లకాలము బాధలనుపొందడ మునకు కారణమైనదిగనుక దగాలుచేసే బోగంవాళ్లయొక్క పజ్జలకుపది వేల దండములు ॥

శ్లో॥ దర్శనాచ్చిత్తవైకల్యంస్పర్శనాత్తుధనక్షయః।సంభోగాత్కి ల్బిషంపన్నాస్త్రీణాంప్రత్యక్షరాక్షసం॥

టీ॥ వారాంగనలయొక్క దర్శనమువలనమనస్సుకు వికలముపుట్టు ను- ముట్టుకొనినధనక్షయమగును, సంభోగించినందువలనపాతకముసం భవించును-అందువలన వేశ్యస్త్రీలు ప్రత్యక్షరాక్షసులని తాత్పర్యము ॥

రుతుమతితోవున్న స్త్రీతోగాని- గర్భిణితోవున్న స్త్రీతోగాని- సంగ మముచేసిన యెడలను- బ్రహ్మహత్య- స్త్రీహత్య. శిశుహత్యాదిదోషము లనుపొంది మహారౌరవాదినరకములనుపొందును

కామముచేత స్త్రీపురుషులు పశుపక్షిమృగాదులతో నెవరు సంగమ ముచేయుదురో వారిని నరకమునందుపట్టుకుని వజ్రములతో సమానమైన ముళ్ళతోనున్న ఘనతరమైనశాల్మలీవృక్షములయొక్క మానులకు విరచిక ట్టి యెల్లప్పుడున్నూ దంచుచుండగ నేకబాధలనుబొందుచుందురు ॥

కండకేదోషములేకున్నను యింట్లో జాగ్రతపెట్టినయెడల నేకుక్కయు ముట్టుకోనేరదు - అట్లుండేవీధుల్లోనుండినట్లైతే ప్రతికుక్క ముట్టుకొనుటకు యభ్యంతరముఉండదుగనుక స్త్రీకి ఘోషా లేకున్న మహాపతివ్రతలకు సహా బలవంతచెరలవల్లను బాధింపబడుచున్నారుగనుక స్త్రీలకు ఘోషాము ఖ్యమయ్యేయున్నది-

తనయొక్క భార్యకు మొదల వివాహమయినరోజు మొదలుకొని మిక్కిలి ఖాయిదాగానుకడునదవులోను జాగ్రతపెట్టియుంచవలెనుగాని - ప్రేమ చేత నెత్తిమీదకెక్కించుకొనగూడదు - అలాయెక్కించుకొనువాడు చెడి పోవును- కొంతక[illegible]మైనాగాకుండ వివాహమయిన మొదటికాలములోను

బొత్తిగా నెత్తిమీదకు నెక్కించుకొనగూడదు- భార్యనాలాఘాయిదాగా
సదవుతో జాగ్రతబెట్టుకొనిదుష్టస్త్రీలనుసవాదగ్గిరకురాకుండాచేసి సౌ
ఖ్యమయిన నడతగలిగినవారలైతనయందువిశ్వాసముగల నమ్మికమైనస్త్రీ
లనుదగ్గిరయుంచికాపాడుకొనవలెను దుష్టబుద్ధి, దుష్టనడతగల దుష్టస్త్రీ
లనుదగ్గిరకుచేరనివ్వకూడదు, తనస్త్రీలుండేస్థలముకు పురుషులను మసలని
య్యకూడదు- తనయందువిశ్వాసముగలవారలైయున్ననమ్మికమయినవా
రలనుమాత్రమేవిన్నైనపనిపాటలున్నపక్షమందు వెళ్లనియ్యవలసినదేగాని
పనిపాటలులేనిదే వారలనయిననూ పదేపదే వెళ్లనియ్యకూడదు- దుష్టబుద్ధి
యు దుష్టనడతయు నసౌభాగ్యతయుగల మగవారలను తనవంక వారలయిన
నూగాని, భార్యవంక వారలయిననూగాని- తనకెంతసన్నిహితబంధువుల
యినప్పటికి వెళ్లనియ్యకూడదు, భార్యనుపుట్టింటనుగాని, యెంతసన్నిహిత
బంధుత్వమున్నను కావలసినవారియిండ్లలోగాని చాలాకాలముంచకూడ
దు భార్యకతిగాచనువివ్వకూడదు. సమయాసమయములనుపట్టి ప్రీతియు
న్నుజేయుచుండవలయును, భర్తసౌభాగ్యతగలపతివ్రతైనభార్యయెడలన
తిప్రీతితోనర్ధప్రాణములతోసమానముగాచూచుకోవలెను తల్లితండ్రితో
దూసమస్తంవదిలివేసి తననేదిక్కని నమ్మియున్న పతివ్రతయయినసతినసు
యోగ్యురాలగుభార్యనాలాగధర్మప్రాణముగా చూచుకొననియెడల యా
పాపాత్ముకాధముడు, స్త్రీహత్య, శిశుహత్య, బ్రహ్మహత్య, గోహత్యాది
పాతకములనుపొంది మహారౌరవాదినరకములయందు బాధలను పొందు
చుండడమేగాకననేకజన్మములయందుశిరిసంపత్తులునశించును- భార్యాది
గ్గిరరంకుతనముమాత్రము లేకుండ తదితరమైనలోటులెన్నిదోషములున్న
ను భర్తమందలించుచుంటు జాగ్రతపెట్టుకొనవలెను గాని విడిచిపెట్ట
కూడదు- భార్యయెడలరంకుతనముంటేమాత్రము తప్పకుండవిడిచిపెట్టవ
లెనుగానియెప్పుడునుహానిచేయకూడదు - అలాహాని చేసెనేని స్త్రీహత్య
సంభవించిమహారౌరవాదినరకబాధలనుపొందును - తల్లియును- తోబు
ట్టువునువాళ్లయొక్కయామ్మలక్కల చేతనుచెప్పేమాటలనునమ్మి నివాసిజము
లకనుగొనకుండభార్యనిబ్బందులు పెట్టినపాపాత్ముడు మహారౌరవాదినర
కంబులయందు పెక్కుబాధలనుపొందును-

ంకములు లేకుండాయుండి ... తుదినములను విఫలముచేసినయెడలన
ను బ్రాహ్మహత్య శిశుహత్యాదిదోషములనుపొంది మహాఘోరవాదినరక
ములనుపొందును.

## పరపురుషగమననిషేధవిషయము-

స్త్రీ యన్యపురుషగమనము చేసెయెడల మహాఘోరవాదినరకము లనుపొందక్షమే కాకుండ యినపగదలచే దంచబడుచు- నాయుధములచే ఖండింపబడుచు మరగినచమురులో పడద్రోయబడి వేచబడుచు మొదల యినయనేకవాట్లచేయనేకవత్సరములుతజ్జనాది బాధలనుపొందును.

సీ॥ ప్రాణేశు డెరిగినప్రాణంబునకు దెగుదండించు నెరిగిన్న ధరణివిభు
డు। మామ యెరింగినమను వెల్లజడిపోవు దలవరియెరిగిన్న దగువు సేయు।
దల్లిదండ్రులెరిగినదలలెత్త లేకుందు రేరాలెరింగిన నెత్తిపొడుచు। నాత్మజు
లెరిగిన నాదరింపరు జూచి బాంధవులెరిగిన బహిష్కరింత్రు। యితరులెరిగిన
నెంతయు జులకగా। జూతురిందునందు సుఖములేదు। యశము లేదు ని
ర్భయానందమును లేదు। జారు జేరదగదు చారుముఖి॥

టీ॥ భర్తయెరిగినప్రాణంబుపోవును-అధికారియెరిగినదండించును- మామయెరిగిన మనువుచెడిపోవును - తలవరియెరిగినదగువుపెట్టును - తల్లిదండ్రులెరిగిన సిగ్గుచేతలలెత్తకుందురు - సవతి- తోటికోడలు - అక్కపడుచు - వీరలెరిగినయెడల నెత్తిపొడుతురు - తనపుత్రులు - పుత్రికలు- నెరిగినయెడలనాదరింపరు- బంధువులెరిగినయెడల బహిష్కరింతురు - యితరులెరిగినపక్షమున చులకగాజూతురు- గనుక తనకాపురమునకు- జారత్వమునకుగూడ సుఖములేదు - యశస్సులేదు- నిర్భరమైనయానందమున్ను లేదు-గనుక స్త్రీ జారత్వము చేయుటకూడదు-

## పతివ్రతావిశేషము-

క॥ నడువడికొరగాదన్నను। బదుగైనకురూపియైనపామరుడైనన్। జ
డుడైనరోగియైననువిడుచుటమర్యాదగాదువిభునంగనకున్॥

టీ॥ యోగ్యమైన నడవడి లేదన్నను స్థూలవంతుడైనను రూపహీనుడై నను తెలివిహీనుడైనను మందబుద్ధిగలవాడైనను రోగముగలవాడైన

ను భర్తనువిడిచి పెట్టడము స్త్రీకి కూడదు.

శ్లో॥ దరిద్రోవ్యసనీవృద్ధో వ్యాధితోవికలస్తథా। పతితఃకృపణోదీనః స్త్రీణాంభర్తాపరాగతిః॥

టీ॥ దరిద్రుడైనను నపుంసకుడైనను- వృద్ధుడైనను, వ్యాధిపీడితుడైనను- వికలమనస్సుకలవాడైనను- జాతిభ్రష్టుడై నీచుడైనను, కృపణవృత్తిగలవాడైనను, దీనుడైనను, స్త్రీకి భర్తయేగతి.

శ్లో॥ నాస్తిభర్తృసమోబంధు ర్నాస్తిభర్తృసమస్సుహృత్। నాస్తిభర్తృసమోనాథో నాస్తిభర్తృసమఃప్రియః॥

టీ॥ భర్తతోసమానమైనబంధువులెవరున్నకారు, భర్తతోసమానమైనస్నేహితులెవరున్నకారు, భర్తతోసమానమైననాథులెవరున్నకారు, భర్తతోసమానమైన ప్రియులెవరున్నకారు.

శ్లో॥ నాతంత్రీ వాద్యతేవీణా నాచక్రోయాతివైరథః। నాపతిస్సుఖమాప్నోతినారీబంధుశతైరపి॥

టీ॥ తీగెలేనిదేవీణపలుకదు, చక్రములేనిదేరథమునడువదు- స్త్రీకి వందలకొలదిబంధువులున్నప్పటికి భర్తకంటెసుఖముకలుగజేసేవారెవరున్నకారు.

శ్లో॥ మితందదాతిహిపితామితంభ్రాతామితంసుతం। అమితస్యతుదాతారంభర్తారంకానపూజయేత్॥

టీ॥ తండ్రిఅయినను- తల్లిఅయినను- కుమారుడయినను - ఎంతవరందిముఖ్యులయినను - సౌఖ్యమునుయిచ్చేవారుకారు - ముఖ్యముగాభర్తయన్నిసౌఖ్యములనునిచ్చెదువాడుగనుక భర్తనుపూజించడముకంటెస్త్రీకివేరేయితరపూజయేమియూజరూరులేదు.

శ్లో॥ యస్యభార్యాశుచిర్దక్షా భర్తారమనుగామినీ। నిత్యంమధురవక్త్రీచసారమానరమారమా॥

టీ॥ ఎవనిభార్యశుచిగాను- సమర్థురాలుగను - భర్తమాటకుమారాడకుండసహచర్యానువర్తినిగ నెల్లప్పుడుమధురవాక్కులుగలదిగనుండునోయాస్త్రీమనుష్యమాత్రురాలుగాదు. లక్ష్మితోసమానురాలు-

శ్లో॥ సుతంపతంతంప్రసమీక్ష్యపావకేనబోధయామాసపతింపతివ్ర

నిష్కాపటతఁగొల్చినసాధ్వికి । నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్ ।

టీ॥ ఉపవాసములు - వ్రతములు - తపములు - వెయ్యిచేసినను లాభము లేదు- భర్తనే దైవమని నిష్కాపట్యముతో గొల్చిన ముదితలకు అటువంటి పతివ్రతకు ప్రపంచములయందేవియు దుర్లభము లేదు.

సీ॥ వనితమానసమునో వాక్కాయకర్మలను ధవుని దైవము గాగ దలపవలయు । ప్రత్యుత్తరం బీక పనిమీఁద జెప్పినచెవి జేర్చి వేగంబ జేయవలయు । సత్త్రీముల చోటనాప్తభృత్యులతోడ మాయాప్రచారంబు మానవలయు । ప్రతివాసరంబు శోధనసిద్ధికై నిలయంబు శుభ్రముగ జేయంగవలయు । తొపుడు తనుజూచునో విభుడింట వచ్చి । యనుచు నిర్మలమయిన దేహంబుదనర । బెనిమిటికి నిష్టమైన భోజనపదార్థ । చయము కడు భక్తితో దాను సలుపవలయు॥

టీక॥ పతివ్రతయయిన స్త్రీ త్రికరణశుద్ధిగ భర్తను దేవునిగ తలచుటయు- భర్తయే పనిచెప్పినను మారాడకుండ విన్నదై యాపని శీఘ్రముగ చేయుటయు- సత్త్రీముల- ఇష్టులయి పనిచేసే దాసీలు మొదలయిన ఆప్తభృత్యులు వీరలయందు కపటము లేకుండ యుండుటయు- ప్రతిదినము మంగళప్రదముగా తన ఇల్లలికి ముగ్గుంపించుట కడిగించుట తుడిపించుట వగైరాలచే శుభ్రపరచుటయు - భర్త వచ్చితన నెప్పుడు చూచునోయని పరిశుద్ధమైన దేహముతో నలరుచుండుటయు - భర్తకిష్టమైన భోజనపదార్థములను జాగ్రత పెట్టుచుండుటయు - కలదియైయుండవలెను॥

సీ॥ నిలయము వాటించి నిర్మల దేహయై శృంగార మేప్రొద్దు జేయవలయు । సత్యప్రియాలాప చతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింపవలయు । దాక్షిణ్యసంతోష ధర్మ మేధాదుల దైవతమని ప్రియుని దలపవలయు । నాథుడే పద్ధతి నడచు నా పద్ధతి నడచి సద్బంధుల నడుపవలయు । మార్దవమున బతికి మజ్జనభోజన । శయనపానరతుల జరుపవలయు । విభుడు పతితుడైన వెలది పాతివ్రత్య । మహిమ బుణ్యు జేసి మనుపవలయు॥

టీ॥ ఇల్లు శుభ్రపరిచి, స్నానముచేసి, శుభ్రమయినటువంటి శరీరముగలదియై భర్తయెడల శృంగారములచే ప్రతిరోజు నప్రొద్దుపుచ్చవలెను- సత్యముగాను, ప్రియముగాను, మాటలలో చతురతతో భర్తయొక్క మనస్సు సంతోషపెట్టుచుండవలెను, భర్తయే పద్ధతిగా నడుచునో తాను నా పద్ధతి

ననకయునపానరతులనుజరిగించుచుండవలెను-భర్తయాపాత్రుడైనను స్త్రీ పాతివ్రత్యమహిమవల్లపుణ్యునిగా జేసి మోక్షమువచ్చేటట్లు చేయవలెను.

సీ॥ విభుడువచ్చినరాక విని వేగ యెదురుగానింటివాకిటికి రావలయు| పతి దెచ్చినట్టి వేపాటి సంగ్రహమైన సదిలోనికినిగొంచు నరుగవలయు | కాంతునిచరణముల్ కడిగిపీటము వెట్టి యనుమతి గృహకృత్యమరయవలయు | సతిరహస్యములైన నాదాయవ్యయములు దెలియంగ పతికి బోధింపవలయు | పురుషుననుమతి లేకను బుట్టినింటి | కొకరైబోవుటయును దానుడుగవలయు|వ్రతములను దానములను దేవతలపూజ|లధిపునానతి లేక చేయంగవలదు॥

టీ॥ పెనిమిటి రాక విని తాను వెళ్లవలసినతలవాకిటికెదురుగాపోవుటయు- పెనిమిటి తెచ్చినట్టియేమాత్రపదార్థములనందుకొని లోపలకుతీసుకొని పోవుటయు- పెనిమిటి కాళ్లుకడిగి తూచుకొండుటకుపీటమొదలైనవి వేయుటయు- పెనిమిటి సమ్మతినింటిపనులు చూచుటయు- పెనిమిటికతిగోప్యములయినయాదాయవ్యయములు తెలియునటులింటిగృహకృత్యనడవడికలు తెలియచేయుటయు- పెనిమిటియుత్తరువులేకుండగా పుట్టినింటికి యొంటరిగా పోవకుండుటయు- పెనిమిటియాజ్ఞలేకుండవ్రతములు- దానములు - దేవతాపూజలు- మొదలైనవి చేయకుండుటయు- మొదలైనసద్గుణములు కలిగి ప్రవర్తించవలెను॥

సీ॥ పెనిమిటి పెక్కండ్రు వనితలగైకొన్న సహమయిన వర్తనసలుపవలయు| రమణుడేగతినపరాధంబు జేసినయొగ్గా సర్వక్షమియింపవలయు| ప్రాంతమునప్రియుడిచ్చగించినతనసురత పై పుణ్యంబు జూపవలయు | సఖునితో నానగూడి సవతిగోచరమైనకోపంబుమానిగైకొనగవలయు| నెట్లు పతికిని పైనిందబుట్టనేని | నోర్చిపలుమారుదడవకనుండవలయు | వనవిహారంబులను మనోవాంఛితార్థ | దాయకములనిత్యము ప్రియ దనుపవలయు॥

టీ॥ పెనిమిటియనేకస్త్రీలతో సాంగత్యము చేసినను సహించుటయు- పెనిమిటియేమియపరాధము చేసినను తప్పులెంచక సౌఖ్యకలిగియుండుటయు- పెనిమిటి హాస్యకయ్యకోరినప్పుడు తనరతియొకట నేర్పును జూపి సౌఖ్యమును కలుగచేయుటయు- పెనిమిటి సాంగత్యము చేసిన సవతినిజూచి కోపము చేయక గ్రహించుటయు- యెట్లుగాతనమీదనిందకలిగిననోర్చియు

నింటనున్నవారిమాటకు తానెదురాడకయుండుటయు- తనవిహారములయందున్ తనకోరినవాటినిచ్చుటయు మొదలయినవాటిచేత పెనిమిటిని నిత్యము సంతోషపెట్టుటయు మొదలయినసద్గుణములచేతప్రవర్తించవలెను॥

సీ॥ పరిజనవాహనపశుపికశారికాసారసంరక్షణసలుపవలయు। గురుజనంబులయెడపరమభక్తివహించి చెప్పినయుడిగంబుజేయవలయు। సవతిపట్టునమహాసౌజన్యమైకూర్మిసోదరిమాడ్కిగాజూడవలయు। సవతిబిడ్డలగాంచిసంతసిల్లుచుమరితనదుబిడ్డలవలెదలపవలయు। మగడుపరదేశమరిగినమంగళంబు। సూత్రమేగానిశృంగారశుభగమడిగి। యుత్సవములచేరువనలదిపాన్పు। నందుశయనించవలయుకులాంగనకును॥

టీ॥ భృత్యులు- గుర్రములు- పశువులు- చిలుకలు- గోరువంకలు- మొదలయినతమయొక్క ప్రాణిగణములయొక్క సంరక్షణయు- సత్తమాములయందుమిక్కిలితల్లిదండ్రులయెడవలెభక్తితో వారుచెప్పినశుశ్రూషచేయుటయు - సవతియెడలనతిస్నేహమునుంచితోడబుట్టినదానివలె నేచూచుటయు- సవతిబిడ్డలనుతనబిడ్డలవలెనేతలంచి సంతోషించుటయు - భర్తయూరికివెళ్లినచో మంగళసూత్రము- దత్తుగంటు - మట్టెలు - గాజులు- కాటుక-పసపు-కుంకుమ- మొదలయినవిఎప్పుడూవిధిగానుండవలసినతప్పమిగిలినయితరమైనయలంకారములనలంకరించుకోకతీసివేసి- య

మలుపరుండేస్థలముకుసమీపస్థలమునపరుండుటయు- మొదలయి

గులుకలిగి ప్రవర్తించవలెను॥

దేశమునకునాథుం। డరిగినతత్క్షేమవార్తలరయుచునయ్యై। తెరవునవ్రతములుదైవత। పరిచర్యలజేయవలయుపతిమేల్కోరకున్॥

టీ॥ పెనిమిటి, యితరదేశమునకుబోయినప్పుడు భర్తయొక్క క్షేమవార్తనుదెలుసుకొనుచు - భర్తమేలుకొరకు వ్రతములుమొదలయిన దేవతాపరిచర్యలుజేయుచు - ప్రవర్తించవలెను॥

గీ॥ పుట్టినింటనున్నప్రాద్దులప్రియురాక। వినినయప్పుడుతొంటి వేషమడిగి। సఖులుదానునెదురుచనుదెంచినీరాజ। నంబుజేయనుత్సవంబు తనరు॥

టీ॥ పతివ్రతపుట్టినింటనున్నసమయమునందు పెనిమిటియొక్కరాక వినియలంకరించుకొని-చెలికత్తెలు-తాను- పెనిమిటికెదురుగవెళ్ళిమంగళహారతినియ్యవలెను॥

గీ॥ భర్తచేత నియోగింపబడక సతియు । నెద్దియైనను జేయగాదగ దెక్కువైన । భర్తచేత నియోగింపబడినదాని । జేయకున్కి దోషంబని చెప్పె మనువు॥

టీ॥ భర్తవల్లను నియోగింపబడకుండ నేపనియైనన్ను చేయకూడదు - భర్త వల్లను నియోగింపబడినదానిని జేయకుండయుండకూడదు, ఇట్టుల చేయనియెడల దోషము సంభవించునని మనువు చెప్పెను.

క॥ ఆయంబుఁ గొలది దెలియక । సేయంగాతగదు వ్యయము సేయం దోసిలిఁ । జేయంగవలయు నేనియు । నాయధనమునందు పాదమైనను నొవ్వన్॥

టీ॥ పతివ్రతయైన స్త్రీ భర్తయొక్క యాదాయమును తెలుసుకొనకుండ వ్యయము చేయకూడదు - చేయవలసియున్న యాదాయములో నాలుగవ వంతుభాగము ఖర్చుపెట్టవచ్చును॥

మ॥ కసువుం గట్టెలు నూక యున్న మొక యంగారంబు నుం భస్మము । న్వసలంబాయక చేర్చి దాసులకు కర్మవ్యాప్తి బాలించి దు । ర్వ్యసనంబుల్ విడనాడి భర్త విడువ వస్త్రాది సంరక్షతోఁ । బిసబాహా మునిమన్ననఁ దనువు సద్భృత్యావళి శుద్ధమై।

టీ॥ కసువు - కట్టెలు - నూక - నివ్వు - బూడిదె - యివి పారవేయక దాచుటయు - అనగా నెంత స్వల్పవస్తువునయినను వృథాగా పారవేయక జాగ్రత పెట్టవలెనన్నభావము భృత్యులకు పనిపాటలు చెప్పి తగినట్టు పరిపాలనము చేయుటయు - దుర్వ్యసనంబులు త్రోసివేసి భర్త కట్టివిడచిన బట్టలను సంరక్షించుటయు - మొదలయిన సద్గుణములు కలిగి ప్రవర్తించవలెను॥

శా॥ పూవుందోటల వృక్షవాటికలలో ఫలాశాకఖాండావళుల్ । గావింపన్వలయున్ విదూషకనటక్రాంతాంగనాభిక్షుకీన్ । దైవజ్ఞవ్యభిచారిణీ వివిధమంత్రప్రక్రియాయోగినీ । భావస్త్రీసహభావనంబులు నసద్భావంబు సద్భార్యకున్॥

టీ॥ పతివ్రతయైన స్త్రీ పువ్వులతోటలయందుండే పువ్వులు మొదలైనవియు - వృక్షవాటికలయందున్న ఫలములు మొదలైనవియు సంగ్రహించి - పెనిమిటికినిచ్చుచుండవలెను - విటనటవిదూషకుల సహవాసము గల స్త్రీలు - భిక్షుకి - సోదె వగైరాలు గురిచెప్పే స్త్రీ - వ్యభిచారిణి - మంత్రతంత్రావధములుగల స్త్రీ - యోగిని - మొదలైన స్త్రీలయొక్క సహవాసము లేకుండా ప్రవర్తించవలెను॥

## సత్యాద్రౌపదీసంభాషణము.

సీ॥ నీప్రియభర్తలనిర్మలవృత్తుల ప్రకటతేజులలోకపాలనిభుల। భార్గలే
నీవొకభంగినివదలకచెలువయొప్పంగభజింతుదగిలి । యొక్కొ-డొక్కొ-నీకు
గొనువిదనీకెవ్వుడుననురక్తులగుట యత్యద్భుతంబు । నగుమొగంబులకా
నినాటినీదెసనెవ్వుటతులకుగినక-యొప్పాట లేదు॥

టీ॥ నీయొక్క-ప్రియభర్తలునిర్మలవృత్తిగలవారు - ప్రకాశమాన
మైనకాంతిగలవారు- భూమిపాలకులు- భార్గులు - నిన్నువొక్క-మోస్తరు
సవదలకుండాచిన్నదానాయుక్తిగానిన్నుజేరిభజింతురు- వొక్కొ-కనికం
టెన-చిన్నదానానీయెడలఎప్పుడూప్రియుగలవారైయుంటుటఆశ్చర్యము-
నగుమొగములేకాని చిన్నదానానీయందుయెప్పుడూ భర్తలకుకోపము
యొంతమాత్రమున్నూ లేదు॥

గీ॥ వ్రతముపెంపోమంత్రౌషధవైభవంబో । సరసనైపథ్యకర్మకౌశ
లమోచతుర । విభ్రమోల్లాసరేఖయో వెలదినీవి । శేషసౌభాగ్యహేతు
వుచెప్పుమనాకు॥

టీ॥ వ్రతములయొక్క-విశేషమో-మంత్రౌషధములవైభవమో- సర
సనైపథ్యకర్మకౌశలమో - ఆశ్చర్యసంతోషరేఖయో - చిన్నదానా - నీ
యొక్క-విశేషసౌభాగ్యహేతువుచెప్పుమునాకు॥

క॥ ఏనునునీవలననిజము। గానిదియంతయునునెరిగికమలదళాక్షుని ।
బూనివశగతునిజేసియు । నూనస్నేహానుభోగయుక్తితలిర్తుని॥

టీ॥ నేనున్నూనీవలననిజముగాయిదియంతయున్నుయెరిగి కృష్ణమూర్తి
నిబూని వశమునుజేసుకునియెల్లప్పుడూ స్నేహానుభోగయుక్తిపొందుదును॥

క॥ అనియడిగినమదినించుక । గినుకవొడమనత్రుంచుకొంచుచుగృష్ణప్రియు
రాలో। సినియగుచుసత్యభామం । గనుగొనియిట్లనియెనిర్వికారాకృతియై॥

టీ॥ అనియడిగినమనస్సునందుకొంచముకోపమువచ్చేసరికిఅతడుకొం
చెకృష్ణప్రియులహాసినియగుచుసత్యభామనుచూచియిట్లాగనఅనెమనసిక్కా
ష్టతనుపొందినదౌకుంటూ॥

క॥ ననునిట్లుదుష్టవనితా । జనమునటులుగాదలంపజనునేసీకుని । మ
సొప్పదుపురుషోత్తమ । వనితవుగాదగవునీవువనరుహానయనా॥

టీ॥ నన్నుయిట్లుదుష్టస్త్రీలవలెనేతలచడంనీకుతగునా మనసొప్ప
దు కృష్ణమూర్తికిభార్యగాతగవునీవుపద్మనేత్రి॥

మగనికిదెచ్చురోగములు మానక మూకజడాదిభావముల్ । మొగినొసరించునస్వరితమ్ముల్దనచేసినచేతలై తుదిన్ । జగమున నెక్కినిందయును సద్గతిలేనియునవచ్చునింతికిన్॥

టీ॥ ఆ పెట్టినమందులచూర్ణములవల్లబాధించి భర్తకు రోగములు పుట్టించి మూగతనముకలగజేయును్ను - మతిలేకుండా చేయుటయును్నా తాను చేసినపనులవల్లను బాధించి అఖరుకు జగత్తుకు అంతకూ తెలిసి నిందకల్గజేయును్ను - సద్గతికిపోనియున్నవచ్చును॥ అట్టిమంత్రతంత్రవిధములవల్లను భర్తకు మరణమున్ను కలుగును॥

క॥ కావున పతులకు నెప్పుడు । గావింపగదగదు కపటకర్మంబులు తే । జ్ఞావమెరిగివశవర్తిని । యై చనితచరి పనటి యుయుగు నెల్లవియున్॥

టీ॥ కనుక భర్తలకు యెప్పుడున్ను కపటకర్మంబులయిన మంత్రతంత్రౌషధములు చేయకూడదు. భర్తయొక్క భావమెరిగి వశవర్తినియై సంచరించినట్టయితే అన్ని ప్రియములున్ను కలుగును॥

వ॥ పాండవుల మొకనె నే వాంఛనై యిట్టిసౌభాగ్యంబునందితినది సంపాదింగించెద నేర్పడ వినుము॥

సీ॥ పతులాత్మనొండొకపడతులకలసినను గనెయ్యెడలనహంకరింప మదః ప్రమాదంబుమాని వారికిచిత్తమేకముఖంబుగ నెల్లపొద్దు । భక్తి సేయుదుబాపు పలుకులుగోరికయు జేయ్తులు వింతగా జేయనెపుడు । నమరగంధర్వయక్షాదులందైననుబురుషునన్యుదృణంబుగదలంతు । స్నానభోజనశయనాది సంప్రయోగ । పద్ధిబల్ ముకుమున్నందునాచరంప । పతులు వచ్చినసాసనపాద్యవిధుల । భక్తితో నేనకావింతుబను పనోరుల॥

టీ॥ భర్తలుమరివక స్త్రీలతో ప్రవర్తించినట్టయితే - అలుగను - కోపించను - మదప్రమాదముమాని వారికిమనస్సుయేకముఖంగా యెల్లపొద్దులభక్తిని సేయుదును - చూపు - పలుకులు - కోరికయు - చేష్టలు వీటియందువ్యతిరేకభావముగా యెప్పుడున్ను చేయను. అమరగంధర్వయక్షాదులయినను అన్యపురుషుని తృణంబుగదలతు. స్నానభోజనశయనాది పనులు భర్తలకుముందర జరపకుండా నేను ముందుగా చెయ్యను. భర్తలు వచ్చిన ఆసనపాద్యవిధులు భక్తితో నేనే చేస్తానుగాని మరివకరిని పంపను॥

చ॥ ఏగిమొకవేళయందు నియతంబుగ మజ్జనభోజనక్రియల్ । దగవాడగూర్తు భర్తలకు ధాన్యధనంబులురిత్తసైవ్రయిం । బగుటకు నోర్వ నెప్పు

ము త్తినల్లనయిననాకు నాహారనిద్రల కడము లేకుపవ్వెయెల్లపోయెద్దు।

టీ॥ నాకు రాత్రియుండగానిద్రనుపొందుదునుగాని - రాజ్యభారకా ర్యములవల్లనాకుభోజనముకు- నిద్రకు వెల్లపొద్దు తెరపి లేదు॥

చ॥ పతిగడకంటె దైవతముభామలకెందును లేదుప్రీతు స్త్రీ। పతికరుణించె నేనికలభాషణభాసురభూషణాంబరా। స్వతధనధాన్యగౌరవము విశ్రుత సంతతియును యశంబు సద్గతియును గల్గునొంతు మెయి గల్గునెయున్న తెరం గులారయన్॥

టీ॥ భర్తకంటె దయివము స్త్రీలకెందునూ లేదు. ప్రీతిగలవాడై భర్తకరుణించినట్టయిన భార్యపరికాశించుచున్న- భూషణ వస్త్ర- ధన ధాన్యములు - గౌరవము - ప్రఖ్యాతమయినసంతతి - యశంబు - సద్గతి యున్న- యివియన్నియునుకలిగియుండును॥

గీ॥ కరముసుఖపడి పగానిమొకిరంతసౌ। ఖ్యంబుధర్మగతియుగలుగ కెందు। జాడనాలిభర్తృశుశ్రూషఫలమునం। తతసుఖంబుగలదుధర్మ వాదవు॥

టీ॥ చెయ్యికష్టపడినంగానికొంచమయిననెందులోను సౌఖ్యము - ధర్మ గతియుగలుగదు. చూడభర్తయొక్కశుశ్రూషఫలమెల్లప్పుడూ సుఖము కలదు. ధర్మమునుపొందును.

క॥ కావుననిత్యముసమ్య। గ్భావము ప్రేమంబు వెరవుభక్తియుబ్రియ ముం।గావింపుముప్రియ నెడనీ।భావ మెరిగియతడుదాసపైబడి మరుగున్॥

టీ॥ గనుకనిత్యము తప్పనిసభావమును- ప్రేమయును- భయమును- భ క్తియును - ప్రియమును - కలిగిభర్తయెడల నున్నట్టయిన నీభావ మెరిగిన పైని ప్రేమించును.

మ॥ వనజాక్షుండుగడంగినదగుగృహద్వారంబు జేరంగవ।చ్చెనసం గావిని వెమ్ము సంభ్రమముతో జెన్నొందునభ్యంతరం। బునకున్ వచ్చిన నా సనాదికరణంబుప్పేర్పద త్రిజ్జనం। బుసితూగించితినంచునుండక ప్రియం బు త్సేయునీవుందగన్॥

టీ॥ నీభర్తనీవుండేయింటిగుమ్మముదగ్గిరకువచ్చినట్టువినగానే లేచిసం తోషముతో స్నానాదికరణంబులుదగ్గిరవున్నవాళ్ళకుభరమాయించినాసని యూరకొనియుండక ప్రియముతో నీవేచేయవలెను॥

చ॥ తివిరిముతారిసికుగఫల తిరుగ చెప్పినపలుకు గిలిసిన కుతిలియు నేత్రని

మనసుగూడినవారికైనఁ జెప్పఁగా। వలవదు దానఁ గొంచెపు నెపంబున
తు రెరింగి రేని। సవతులు గృష్ణుబుద్ధి విరసంబగు నీదె సత్యప్రియుక్తిచేఁ।

టీ॥ నీభర్తయైన కృష్ణమూర్తి నీతోఁ బ్రీతిగాఁ జెప్పిన యే మాటలైనను మరియే వైనను నీ మనస్సుతోఁ గూడినవారి కెవరికైనను చెప్పఁ గూడదు- అలా చెప్పినట్టయిన నది యొక నెపంబుగా వారెరిగినట్టయితే ఘటింతురు - నీ సవతు లెరిగి రేని కృష్ణుని యొక్క బుద్ధి నీ యెడల విరసము పుట్టేటట్టుగా సమయోచిత యుక్తి చేతను చేయుదురు॥

చ॥ పతికినుంగులైన తను బంధుల మిత్రుల భోజనాదులన్। తత్కృతము లనాదరించు మనకృత్రిమభక్తివిశేష సంతతో। ద్ధితము వివరింపుము తదీయహితేతర వృత్తులైన వారి రతివ భవత్సహ్యజ్ఞనమైనను గైకొనకుండు మేర్పడన్॥

టీ॥ భర్తకు ముఖ్యులయిన తన బంధువుల యొక్కయు మిత్రుల యొక్కయు భోజనాదులను జాగ్రత పెట్టుచు నాదరించవలెను. భర్త యెడల కృత్రిమము లేని భక్తితో విశేషముగా నెల్లప్పుడు మంచి మనస్సు గలదానవై సంచరించుచుండవలెను, తదితరమయిన పనులు చేసి వారు నీకు స్నేహితులైనను గైకొనకుండాయుండవలెను॥

క॥ కులపతులు సుసతులునుని। ర్మలవతులున్ననయట్టి మగువలతో డ। చెలిమి యొనరింపు మనదిదు। ర్విలసిత వసితాళియు విడువుము తరుణీ॥

టీ॥ కులశ్రేష్ఠులయిన భర్తలయొక్క భార్యలైన నిర్మల సతులైనటువంటి స్త్రీలతోను చెలిమి జేయవలెను - దుష్టనడత గల దుర్మార్గ స్త్రీలతో స్నేహము చేయకుండాయుండి దగ్గిరకు చేరనియ్యకుండాయుండవలెను॥

క॥ వినుపద్యుమ్నాదిభవత్తన। యులతో నైన నేకతంబున నేకా, స నమున నుండుట దూష్యంబని యెరుగుము సత్కులచరిత లతియుపకారముల్॥

టీ॥ వినుపద్యుమ్నుడు మొదలుగా గలసిగ భర్తవాసము పుట్టినపుమార్యతో నైన నేకాసనమున గూర్చుండుట దూష్యమని యెరుగవలయును. అనగా పతివ్రతవయస్సువచ్చిన తనకొమారునితో నైనను - ఏకముగా నొకయాసనముమీద కూర్చుండుటయును మరియొకరి దృష్టికి కనపడకుండాయుండేటట్టుగా నుండే స్థలమున ప్రియవేటుగా యిద్దరే కూర్చుండి మాట్లాడుటయును కూడదనుట స్త్రీలయొక్క చరిత్రలతియుపకారములు॥

శ్లో॥ పితారక్షతికౌమారే భర్తారక్షతియౌవనే। పుత్రోరక్షతివార్ధ

శ్లో॥ న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి॥
టీ॥ బాల్యదశయందు తల్లిదండ్రుల యొక్క సంరక్షణలోను యౌవనదశయందు భర్త యొక్క సంరక్షణలోను వార్ధక్యదశయందు పుత్రుని యొక్క సంరక్షణలోనుండవలసినదే గాని స్త్రీకి యెప్పుడును స్వాతంత్ర్యము లేదు.

శ్లో॥ స్త్రీ పుంవచ్చ ప్రభవతి యదా తద్ధి గేహం వినష్టం॥
టీ॥ స్త్రీ పురుషునివలెనే యెవతె స్వతంత్రించి పెత్తనము జేయుచుండునో యాగృహము చెడును.

మహాభాగ్యతగానుండే పతివ్రతా మహిమా విశేషమునకు చంద్రమతి ధర్మాంగదుని భార్య - అనసూయ - లోపాముద్ర - అరుంధతి - గాంధారి - ద్రౌపది మొదలుగాగల యనేక పతివ్రతా స్త్రీలకథలే మనకు నిదర్శనములు॥

ఇంతేకాకుండా హరిశ్చంద్రుని భార్య చంద్రమతీదేవి తమ యొక్క పోయినటువంటి కుమారుని దహనమునకు తీసుకువచ్చినప్పుడు హరిశ్చంద్రుడు చంద్రమతియని వాకిరిసినొకగు గుర్తించినదరువాతను పుత్రశోకమున దుఃఖించుసమయమున పైగా నిరపరాధినియైన తనభార్యను నరకవలసిన సమయమున భర్తనరకలేక విచారించుచున్న సంగతిలో భర్తతో నావంటి భార్యలనేకమంది మీకుదొరుకుదురు మీ సత్యము మాత్రము తప్పవద్దు తనను తప్పక నరికివేయుమని చంద్రమతి చెప్పెను తనప్రాణము కు సహాయాసించక భర్త సద్గతికొరకే యాలోచించిన మహాపతివ్రతా శిరోమణియయి యుండెను. ఇంతేకాక సత్యమందు యెంత మహిమ యున్నదిస్ని యుండు మూలమున తెలుసుకోవలెను. ఇంతేగాక ధర్మాంగదుడు పాముల యుజ్ఞనింతా...మేక న్యాయముగా పెళ్ళిచేసినటువంటి పతివ్రతాశిరోమణియైన యా మనభార్య యొక్క పతివ్రతా మహిమ భాగ్యత చేత నే తన భర్తయయిన పాము చేతను తనయావజ్జీవము సౌఖ్యము గతిలేకుండాయున్నటువంటి పాముగానున్న భర్త మనిషియాయెను అభర్త కోటిసౌఖ్య పడెను సావిత్రి తనభర్త ఐశ్వర్యము పోయినదని యాయువు యము లేదని తెలిసినప్పటికీ యాయనను తనభర్తగా తనమనస్సునందు తలంచునంతమాత్రము చేతను నారదుడు తల్లితండ్రులెంత చెప్పినను నాయననే వివాహము చేసెదనని దృఢనిశ్చయము గలదియై వివాహమాయెను పతివ్రతాశిరోమణిగనుక నే యొక్క మనుష్య మాత్రులైన నా మొగుడు భర్తను తీసుకుని వెళ్ళే

యమధర్మరాజున్ను తీసుకు వెళుతూ వున్న సూక్ష్మమైనభర్తయు ఆమె దృష్టికి కనపడుటయు భర్తతో కూడా వెళ్లుటకు సత్తాగలదియు అయి తన అత్తగారికి మామగారికిన్ని నేత్రములూ దేశమూ తెచ్చుటయు తనతల్లి తండ్రులకు కుమారుళ్లు కలిగేటట్లుగా చేసి వంశమునిలబెట్టుటయు తనభర్తను సంజీవింపచేసుకొనుటయు గలమహిమ కలిగినది అయెను గనుక పురుషునకు సత్యపౌరుషనీతివిశ్వాసములతో అలంకారధనరూపసంపన్నతలు సమానములు కానేరవు స్త్రీకి పతివ్రతాధర్మసత్యములతో రూపఅలంకారసంపత్తులు సమానములు కానేరవు॥

శ్లో॥ హీనజాతిస్త్రియం మోహాదుద్వహంతో ద్విజాతయః । కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతాం॥

టీ॥ ద్విజాతులనగా బ్రాహ్మణులు - క్షత్రియులు - వైశ్యులు వీరుహీనజాతిస్త్రీని మోహమువలన బరిగ్రహించి వివాహమాడితే నివారికి కలిగినసంతానములతో కూడా వారికులములు శూద్రత్వమును పొందును॥

బ్రాహ్మణుడు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రస్త్రీలను - క్షత్రియుడు క్షత్రియవైశ్యశూద్రస్త్రీలను - వైశ్యుడు వైశ్యశూద్రస్త్రీలను - క్రమంబుగా వివాహము కావచ్చునని చెప్పబడియున్నదిగాని హీనాతిసజాతికి తక్కువజాతిస్త్రీలను వివాహమగుటయు గాక, జారత్వము చేత పొందుటయు గాని కూడదు అలా సంభోగించితే తనయొక్క బీజము యోగ్యతగల స్వకులభార్యాక్షేత్రమందుపడితే ఆబీజముకు యోగ్యమయినజన్మము వచ్చును. తక్కువక్షేత్రమందుపడితే నీచపుజన్మము వచ్చును. అలా తనబీజముకు నీచపుజన్మము వచ్చినందువల్లను ఆబీజము నీచపుక్షేత్రమందుపడ వేసినందువల్ల పుట్టిన నీచపుజన్మ తనకు వచ్చినదిగదా యని ఆబీజము దుఃఖించి శపించును. అందువలన తనకు నాశనము వచ్చును, యింతేగాక స్వకులస్త్రీని వివాహమయిన భార్యయందు పుట్టితే ఆత్మా వై పుత్రనామాసి అనే వాక్యమును బట్టి తనయొక్క బీజము తనయొక్క తేజస్సే అయివుండివున్నది. గనుక తనబీజమువల్ల పుట్టి జన్మించినవాడు తానే తనస్వకులభార్యగర్భమందున తాను తిరిగి జన్మించినట్టులవును. గనుక యోగ్యక్షేత్రమునందు తాను పుట్టి యోగ్యమయినజన్మముగలవాడైయుండిన్ని - నీచపుక్షేత్రమున తాను తిరుగా నీచ మృత్త ఘట్టకము వచ్చును గనుక తనజాతిస్త్రీని వివాహమాడవలెను తప్ప తనజాతికంటె తక్కువజాతిస్త్రీని వివాహమాడుటయును సంభోగించుటయును కూడదు॥

బ్రాహ్మణక్షత్రియులు శూద్రస్త్రీతో పొందిన షండాలత్వమును పొందుదురు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు షండాలులతో పొందినట్లైతే షండాలత్వమువచ్చును యేజాతివారైనను తనజాతిగలస్వభార్యతో స్వభర్తతోను తప్పతనకంటేతక్కువజాతివారితో పొందుటదూష్యము॥

శ్లో॥ సగోత్రాంసమానప్రవరాంకామతః। పరిణేయప్రజాముత్పాద్యగురుతల్పవ్రతంచరేత్ ॥

టీ॥ సగోత్రురాలినిన్ని-సమానప్రవరురాలినిన్ని- బుద్ధిపూర్వకముగా పెళ్ళియాడిసంతానమునుపుట్టించినయెడలగురుతల్పమునకుచేసుకోవలసినప్రాయశ్చిత్తముచేసుకోవలెను -

శ్లో॥ తత్ప్రజాంచండాలేషు నిక్షిపేదకామతస్త్వబ్దకృచ్ఛ్రం ప్రజాయాంభారద్వాజసగోత్రాంతర్భావః॥

టీ॥ వాళ్ళకుపుట్టినసంతానముతో నుమాలవాళ్ళతో జేర్పవలయును, బుద్ధిపూర్వకముకాకుండాఅబుద్ధిపూర్వకముగా పెళ్ళిచేసుకున్నయెడలఅబ్దకృచ్ఛ్రవ్రతమును చేయవలెను, వాళ్ళకుపుట్టినసంతానమును భారద్వాజసగోత్రములో చేర్పవలెను॥

శ్లో॥ వివాహమాత్రే చాంద్రాయణవ్రతంచరేదిత్యాహభగవాన్బోధాయనః॥

టీ॥ సగోత్రురాలినివివాహముచేసుకొన్నంతమాత్రముచేతనే చాంద్రాయణవ్రతముఆచరింపవలయునని బోధాయనమహర్షి చెప్పెను॥

తనపిల్లలకు వివాహములు చేసుకోవడములో తనపిల్లనుయిచ్చేపిల్లవానియొక్కపూర్వోత్తరం తెలుసుకోకుండాగాని- డబ్బుకుఆశించి కక్కుర్తిపడిగాని - నీచపుపిల్లవానికియిచ్చినను తనజాతికంటే తక్కువజాతివానికియిచ్చినను తనపిల్లకుతగనికురూపిపిల్లవానికిగాని వంశహీనునికిగాని యిచ్చినను- తనపిల్లదానికంటెయీడుతక్కువపిల్లవానికియిచ్చినను- ముసలివానికియిచ్చినను - తనపిల్లకువరసవావిలేనిపిల్లవానికియిచ్చినను - తనపిల్లవానికి వివాహముచేసుకునేపిల్లదానియొక్క పూర్వోత్తరం తెలుసుకోకుండాగాని - డబ్బుకుఆశించి కక్కుర్తిపడినీచపుపిల్లనుచేసుకున్నను - తనజాతికంటె తక్కువజాతిపిల్లనుచేసుకున్నను తనపిల్లవానికి తగనికురూపినిగాని తనపిల్లవానికంటె యీడుయెక్కువగల వరహీనతగలదానిని చేసుకున్నను - తనపిల్లవానికి వరసవావికాని పిల్లనుచేసుకున్నను - తనకుయిట్టాటి

వరహీనపు పెళ్లి అయి తేలేసకు యెంత బాధకము వుండునో అలాగు నేతనపి
ల్లకూ యిట్లాటి వరహీనత గల వివాహము చేస్తే ఆ పిల్ల యావజ్జీవితమూ అం
తులేని దుఃఖముతో వుంటుంది గనుక - యిట్లాటి వివాహములు చేశినవారు
బ్రాహ్మణుని - స్త్రీని - శిశువుని చంపకుండా నే బ్రహ్మహత్య స్త్రీహత్య శిశు
హత్యాది దోషములను పొందినవారై అనేక జన్మములు సిరిసంపత్తులు న
శించుచు మహారౌరవాది నరకములను పొందుతారు తన పిల్లను డబ్బుకు
ఆశించి కన్యావిక్రియముకు యిచ్చి వివాహము చేశినట్టయితే తన పిల్ల యొ
క్క మాంసమును అమ్మినవారు గనుకనున్ను. తన గర్భవాసమున పుట్టిన
కుమార్తెకు అల్లునికి హాని చేశినవారు అవుతారు గనుకనున్ను కన్యావిక్రి
యముకు కొనుక్కొని వివాహము చేసుకున్న భార్యతో వైదిక యాగాదిక
ర్మలు చేయుటకూడదు గనుకనున్ను - మేకలను గొర్రెలను గోవులను యెత్త
నుకోసి మాంసము విక్రియము చేశి డబ్బు సంపాదించుకునే కసాయీవా
ళ్ళకన్ననూ కఠినదుర్మార్గులై పాపాత్ములవును తన పిల్లను విక్రియము
కు అమ్మి సంపాదించుకున్న డబ్బున్ను వృద్ధిలోకి రాదు గనుకనున్ను అనేక జ
న్మములు దుఃఖపీడితులై శిరిసంపత్తులు నశింపుచుండును యిట్లాగున వివాహ
ములు చేశినవారికంటే కఠినదుర్మార్గులు పాపాత్ములు వుండరు గనుక అట్టి
వారలు గొడ్డువారలైనను మేలుగా వుండును - ఆడపిల్లగలవాళ్లను తిలుకము
కింద యిమ్మని సొమ్ము పుచ్చుకున్నాగాని ఆడపిల్లగలవాళ్లే యావత్తు ఖర్చు
లూ పెట్టి వివాహము చేయవలశినదనినాగానిన్ని మర్యాదవంశములో పు
ట్టినవాళ్లు బీదస్థితిలో వుండేయెడలను డబ్బు యిచ్చుకోలేక తన పిల్లకు వివా
హము కాదనే కారణమును బట్టి అట్టివాళ్లకు ఆడపిల్లలు పుట్టితే తన మర్యాద
కాపాడుకునే నిమిత్తము ఆ పుట్టిన ఆడపిల్లలకు యేమైనా పెట్టిగాని పాలూ
మొదలైనవి యివ్వకగాని హానికలగచేతురు గనుక అత్తగారు మామగారు
తమకు కలిగిన మట్టుకు తమ పిల్లకుగాని తమ పిల్లవానికిగాని వారి సంతోష
ముకొద్దీ యేమియిస్తారో అదే కోటిగుణితముగా సంతోషించవలెనుగాని
అది తప్ప పిల్లగలవారినిగాని పిల్లవాడుగలవారినిగాని యేమాత్రిస్వల్ప
మైననూ నిర్బంధనపరచి డబ్బు పుచ్చుకున్న పాపాత్మను బాధకకఠినా
త్ములు బ్రహ్మహత్య స్త్రీహత్య శిశుహత్య గోహత్యాది దోషములను పొంది
మహారౌరవాది నరకములను పొందడమే కాకుండా అనేక జన్మములయందు
ను సిరిసంపత్తులు నశింపుచూ అనేక దుఃఖములను పొందుచుండును ॥

